## 64. గురుపూజాంజలి

కలకత్తా విశ్వవిద్యాలయంలో విద్యార్థినై సునీతీకుమార్ ఛటర్జీ, సుకుమార్ సేన్, క్షితీశ్‌చంద్ర చటర్జీల వద్ద చదవటం వరప్రసాదం. వారు ప్రాచీన ఋషి సంప్రదాయానికి చెందిన ఆచార్యులు.

వారి వద్ద చదివిన వారిలో నేను ఆఖరు జట్టు వాడిని. క్షితీశ్‌చంద్ర, సునీతీకుమార్ 1952లో విశ్రాంతులైనారు. తరగతిలో నేనొకడినే విద్యార్థిని (1949–51). భాషాశాస్త్రం అప్పట్లో జనసామాన్యానికి తెలియదు. చాలా మంది విద్యార్థులు ఆ మాట విని ఉండరు. నాకు ముందు సంవత్సరంలో ఒకే ఒక విద్యార్థి. అంతకు ముందు ఐదు సంవత్సరాలు విద్యార్థులే లేరు. కులపతి అశుతోష్ ముఖర్జీ (1919) దేశంలో గొప్ప పండితులను ఆహ్వానించి వారి కార్యకలాపాలకు పూర్తి స్వేచ్ఛనిచ్చారు. విద్యార్థులు ఉంటే సరి, లేకపోతే తమ పరిశోధనలలో వ్యాపృతులవుతారు.

నాకు తెలుగుపై అభిమానం ఉన్నా, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో బి.ఎ. ఆనర్స్ చదవడం గౌరవంగా భావింపబడుతూండేది కనుక ఆనర్స్‌లో చేరాను (1939–42), మూడేళ్ళ చదువు. తరువాత నాలుగో ఏడాది కాన్వొకేషన్‌లో ఎమ్.ఎ. డిగ్రీ ఇస్తారు. ఆనర్సులో ఆర్థికశాస్త్రంతోపాటు చరిత్ర కూడా ఉంటుంది. దానిలో ప్రథమశ్రేణిలో పాసయిన వెంటనే (1942) మద్రాసు విశ్వవిద్యాలయంలో 'కాకతీయుల చరిత్ర – సంస్కృతి' పరిశోధన (1942–44) పూర్తి కాబోతుండగా సిమ్లాలో లేబర్ ఇన్వెస్టిగేషన్ కమిటీలో (Labour Investigation Committee) రీసెర్చ్ ఆఫీసర్ ఉద్యోగం వచ్చింది. కేంద్ర ప్రభుత్వం నియమించిన నలుగురు సభ్యుల కమిటీ అది. దేశం అంతటా కర్మాగారాల్లో కార్మికుల పరిస్థితులను పరిశీలించి వాటిని మెరుగు పరచటానికి తీసుకోవలసిన చర్యలను సిఫారసు చేయటం ఆ కమిటీ పని. అనుకున్నట్లుగా

రెండేళ్ళలో ఆ కమిటీ పని పూర్తి అయింది.

చుట్టూ హిమాలయపర్వతాలు, ప్రకృతి శోభ–ఆహ్లాదకర వాతావరణంలో రెండేళ్ళూ ఇట్టే గడిచి పోయాయి. మంచుతుఫాను, బీభత్సమైన ప్రకృతి ఎలా ఉంటుందో కూడా చూడగలిగాను. అంతకు 70 ఏళ్ళ పూర్వం అలాటి తుఫాను వచ్చిందట. 12 అడుగుల ఎత్తు మంచు. గుమ్మంలో బరఫ్ (మంచు) తీసుకొని వచ్చి నీళ్ళు కాచుకొనే వాళ్ళం.

సిమ్లాలో ఉండగా సునీతీ కుమార్ ఛటర్జీ గారికి – వారి దగ్గర చదవాలనే ఉద్దేశం తెలియబరుస్తూ –ఉత్తరం రాశాను. దానికి సమాధానంలో వారు ఎమ్.ఎ. ప్రణాళికా వివరాలు రాశారు. అక్కడ రెండు శాఖలు 1. ఇండోఆర్యన్ (గ్రీక్, లాటిన్ భాషాధ్యయనంతో). 2. అనార్య భాషాశాఖ (తమిళం, టిబెటన్ భాషాధ్యయనంతో). ఈ రెండు శాఖలలో ఏదో ఒకటి ఐచ్ఛికవిషయంగా తీసుకోవలసి ఉంటుంది. నేను అనార్య భాషావిభాగం తీసుకోవడం మంచిదని చెబుతూ ఆశీఃపూర్వకంగా ఇలా రాశారు.

'I love you to do it and then you can prepare a thesis, on say, the Historical Grammar of Telugu and that should entitle you to a chair in any of our Indian universities'.

సిమ్లాలో ఉద్యోగం అయిన వెంటనే న్యూఢిల్లీలో ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛాంబర్స్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్ (Federation of Indian Chambers of Commerce and Industries) సంస్థలో రిసెర్చ్ ఆఫీసర్‌గా తీసుకున్నారు. కలకత్తాలో చదవాలనే భావన వెంటాడుతూనే ఉంది.

1948లో దర్భంగాలో జరిగిన అఖిలభారత ప్రాచ్యవిద్యాపరిషత్ (All India Oriental Conference) సభలో ద్రావిడసంస్కృతి విభాగానికి నాన్నగారు అధ్యక్షులు, సునీతీకుమార్ ఛటర్జీ గారు కూడా ఆ సభలో ఉన్నారు. ఢిల్లీ నుంచి నేను దర్భంగా వెళ్ళి వారితో సంప్రదించి మరుసటి సంవత్సరం కలకత్తాలో చేరడానికి నిర్ణయించుకున్నాను. ఢిల్లీకి తరిగివచ్చి అప్పుడు మా డైరక్టరు కె.ఎమ్.మున్షీగారితో కలిసిచేస్తున్న పరిశోధక గ్రంథం

Industrial Profits in India 1940-44 పూర్తి చేసి ఆ పదవికి రాజీనామా చేసి 1949లో కలకత్తాలో చేరాను.

కలకత్తా యూనివర్సిటీలో సుకుమార్ సేన్ గారిని మొదట కలవటం సంభవించింది. మాటల్లో ఆయన "Comparative Philology will give you bread but not butter" అన్నారు. ఫైలాలజీకి మంచి ఉద్యోగావకాశాలు తక్కువ అని ఆ మాటల్లో భావం. నేను మానసికంగా రూ.150ల జీతానికి ఏ కాలేజీలోనో చేరడానికి సిద్ధపడి ఉన్నాను కనుక నాకు అది ఒక సమస్యగా అనిపించలేదు.

ఈ శాఖలోని ముగ్గురు అధ్యాపకులూ సంప్రదాయ సంస్కృత పాండిత్యంతోపాటు ఆధునిక భాషాశాస్త్రంలో ప్రపంచవ్యాప్తంగా ప్రతిష్ఠ కలవారు. క్షితీశ్‌చంద్ర వ్రాసిన Technical Terms and Technique of Sanskrit Grammar గ్రంథానికి ఒక జర్మన్ యూనివర్సిటీ డి.లిట్ డిగ్రీ ఇచ్చారు. సుకుమార్ సేన్ వేదవాఙ్మయాన్ని మధించినవారు. ఇది గాక బౌద్ధసంస్కృత (Buddhist Sanskrit) పరిశోధనకు పునాది వేశారు. దీని ఆధారంగా పాశ్చాత్య పండితులు ఈ శాఖను పరిపుష్టం చేశారు. సునీతీ కుమార్ గారి (Origin and Devolopment of Bengali Language) 'బెంగాలీ భాష ఉద్భవవికాసములు' ఆధునికార్య భాషను గురించి రచించిన విశ్వవిఖ్యాత సమగ్ర ప్రామాణికగ్రంథం. వీరి శిష్యులు హిందీ, ఒడిసా, అస్సామీ మొదలైన ఆధునిక ఆర్యభాషలపై వారి వద్ద పరిశోధన చేసి డాక్టరేట్ పొందడమే గాక ఆయా భాషలలో ప్రామాణిక పండితులై వెలుగొందుతున్నారు. అనార్యభాషపై వారి వద్ద పరిశోధన చేసిన వాడను నేనొక్కడినే.

సునీతీకుమార్ గారి 'భాషాప్రకాష్ బంగ్లావ్యాకరణ్' భాషాశాస్త్రానుసారం కొత్తరీతిని రాయబడినది. పఠనపాఠనాల్లో ఉన్న ప్రామాణిక గ్రంథం. ఎవరూ పట్టించుకోని హిందూదేశం తూర్పుదిక్కున నివసిస్తున్న కిరాతజనులను గూర్చి 'కిరాత జన కీర్తి' అనే పుస్తకం ప్రకటించారు.

ఈ ముగ్గురూ ఇంగ్లీషులోనూ మాతృభాషలోనూ అఖండ ప్రజ్ఞ కలవారు. ప్రామాణిక పరిశోధనా గ్రంథాలు రచించారు. సుకుమార్‌సేన్ History of the Bengali Literature 'బెంగాలీ వాఙ్మయచరిత్ర' కు భారతదేశ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఉపోద్ఘాతం రాశారు. తానొక్కడే బెంగాలీ వ్యుత్పత్తి పదకోశం (బెంగాలీలో) రాశారు. ప్రాకృతభాషలను గురించి వారు చేసిన రచనలు: Comparative Grammar of Middle Indo-Aryan, Historical Syntax of Middle Indo-Aryan. అలాగని వారు వివిధాంశముల మీద చిన్న చిన్న పుస్తకాలు రాయకపోలేదు. సునీతీ కుమార్ 'Bengali Self -taught', 'Bengali Phonetics', కొన్ని రబీంద్రనాథ్ ఠాగూర్ పద్యాల సంకలనం మొదలైనవి రచించారు. వారు రబీంద్రనాథ్ ఠాగూర్ గారికి సన్నిహితులు, స్నేహితులు. వారితో కలిసి ప్రాచ్యదేశాలన్నిటినీ ఓడలో సంచరించారు. సుకుమార్ సెన్ రచించిన చిన్న పుస్తకాలు Place Names in Bengali, Womens Dialect in Bengali, మరియు బెంగాలీలో ప్రాథమిక భాషావిద్యార్థులకు ఉపయోగపడే గ్రంథాలు. ఇవి గాక చిత్ర విచిత్రమైన అంశాలమీద పుస్తకాలు రాస్తుండేవారు. ఉదా॥ దయ్యాలను గురించి బెంగాలీలో రాసిన పుస్తకం. 'ఇది ఏ జర్మన్ యూనివర్సిటీకైనా పంపితే డి.లిట్ డిగ్రీ ఇస్తారు' అని నాతో ఒక మాటు యాధాలాపంగా అన్నారు. గురువులు పాఠం చెబుతున్నప్పుడు విషయాంతరంలోకి వెళ్ళరు. ప్రశ్నలడగటం ఉండదు. సిలబస్ పూర్తి చేయాలనే తాపత్రయం లేదు. విద్యార్థులు స్వయంగా చదువుకోవలసిందే. ఫలానా పుస్తకాలు చదవండని మాత్రం చెబుతారు. చిల్లర పరీక్షలు ఉండవు. రెండేళ్ళ చివర ఫైనల్ పరీక్ష ఒకటే రాయవలసి ఉంటుంది. పరీక్షలు వరుసగా ఎనిమిది రోజులు, ఎనిమిది ప్రశ్న పత్రాలు. సమయం నాలుగు గంటలు – 11 గం. నుండి 3 గం. వరకు.

ఒక మాటు క్షితీశ్‌చంద్ర Vedic and Classical Sanskrit అనే విషయం మీద ఒక వ్యాసం రాయమని చెప్పి Whitney's Sanskrit Grammar, మరి

రెండు గ్రంథాలు సూచించారు. ఆ పుస్తకాలు చదివి వేదభాష కాలక్రమంలో లౌకిక భాషగా మారిన విధానం నాలుగు నెలలు శ్రమించి వారికి చూపించగా ఆ వ్యాసం అంతా వారు చదివి కొన్ని మార్పులు, వివరణలూ సూచించారు. ఆ అనుభవంతోనే 1965లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో వేదిక్ సెమినార్‌లో Vedic and Classical Sanskrit మీద పత్రం సమర్పించాను.

క్షితీశ్‌చంద్రగారికి విద్యార్థులకు పాఠం చెప్పడం అంటే ఎంతో ఆనందం. వారు 'మంజూష' అనే ద్విభాషా (బెంగాలీ–ఇంగ్లీష్) మాసపత్రికను ప్రచురిస్తూండేవారు. ఉపయోగించుకొనేవారికి అదొక బంగారపు గని. ఉదా॥ ఒక బెంగాలీ సామెతను తీసుకొని దానికి సమానమైన సామెతలు ప్రాచీన ఆధునిక భాషల నుండి ప్రదర్శించటం. అయినా చందాదారులనుండి వచ్చే రాబడి అచ్చుకు సరిపోయేది కాదు. అది లెక్క చేయక స్వంత డబ్బుతో Chamber's Encyclopaedia వంటి ఖరీదైన గ్రంథాలు కొనేవారు, నలుగురికీ మంజూష ఉపయోగపడాలని.

లోకరీతిని గురించి సందేహాలు వస్తే గురువులు ఇట్టే సమాధానాలు చెప్పేవారు. ఉదా॥ 1945లో ఒకమారు న్యూఢిల్లీ రైల్వేస్టేషన్ మాస్టర్‌ను (ఆంగ్లేయుడు) "when is the Grand Trunk express expected" అని అడిగాను. (ఆ రైల్లో మా తల్లిదండ్రులు మద్రాసు నుండి వస్తున్నారు. ఉదయం 6.గంటలు) దానికి అతడు She is expected in ten minutes అన్నాడు. ట్రైన్‌ని she అనడం విడ్డూరంగా అనిపించింది. అది మనసులోనే ఉంది. ఈ విషయం క్షితీశ్ చంద్రగారిని అడుగగా వారు That which is guided by another is put in the feminine అన్నారు. కొన్నేళ్ళ తరువాత గాంధీజీ తమ స్వీయచరిత్రలో ship ను స్త్రీలింగంగా వాడడం కనిపించింది. సుకుమార్ సేన్ గారిని ఇలాగే ఒక సందేహం అడిగిన సందర్భం: 'ద్యుహ్రుచ్ఛబ్దంబులకు దివి హృదియగు' అని బాలవ్యాకరణంలో కల నిపాతసూత్రం. సప్తమీరూపం ప్రథమలో ఎలా వాడుకలోకి వచ్చింది? ద్వితీయా విభక్త్యంతం ప్రథమలో వాడడం అర్థం

చేసుకోవచ్చు. ఉదా॥ హనుమంతుడు. సప్తమి ప్రథమలో ఎలా వస్తుంది? దానికి వారు 'హృదిస్థిత జనార్దన' అనే పదబంధం నుండి విడివడి ఉంటుంది అని సూచించారు.

సుకుమార్ సేన్ సంస్కృత భాషాతత్త్వం చెప్పేవారు. ప్రతిసంవత్సరం సిలబస్ పూర్తి చేసేవారు. సునీతీ కుమార్ మధ్య మధ్య విదేశాలకు విజిటింగ్ ప్రొఫెసర్‌గా వెళ్ళేవారు. అప్పుడు నాకు వారానికి మూడు తరగతులు మాత్రమే ఉండేవి. ఈ విషయం సేన్ గారితో చెప్పగా నేను ఖాళీగా ఉన్నప్పుడు ప్రథమ ద్వితీయ సంవత్సరం తరగతులలో వచ్చి కూచోమన్నారు. అప్పుడు వారు పాఠం చెప్పే తీరు తెలిసింది. మరుసంవత్సరం పాఠంలో నూతనాంశాలు ఉండేవి. ప్రవాహంలో పాతనీరు పోయి క్రొత్త నీరు వస్తుంది కదా!

నాకు విడిగా పాఠం చెప్పినప్పుడు అత్యాధునిక పరిశోధనాంశాలు చెప్పేవారు. ఒకమాటు Indo Hittite Laryngeal hypothesis (కంఠం వెనుక పలికే ఒక విలక్షణమైన హకార ధ్వని) ని గురించి చెప్పి ఇది మొట్టమొదటి సారి పాఠం చెప్పడం అని అన్నారు. కొన్నేళ్ళ తరువాత వారి శిష్యుడు సత్య స్వరూప్ సిన్హా ఇండో హిట్టైట్‌ని గురించి విపులగ్రంథం రచించారు.

కలకత్తా నేషనల్ లైబ్రరీకి అప్పుడప్పుడు వెళ్ళి పుస్తకాలు తిరగేస్తూ ఉండేవాడిని. ఒక పుస్తకంలో 'పిల్లా–జల్లా, ఆకూ–అలమూ, పిల్లా–మేకా, చెదురూ–మదురూ' ఇత్యాది జంటపదాలు కనిపించాయి. వాటిని సాధ్యమైనంత వరకూ సేకరించి ఇంగ్లీషులో వ్యాసం రాసి దానికి ఏం శీర్షిక పెడితే బాగుంటుంది అని సేన్‌గారిని అడిగాను. దానికి వారు Intensive and Inclusive Compounds అన్నారు. ఈ పదాలు 'మొదలగునవి' అనే అర్థం కొన్ని చోట్ల, 'అత్యంతార్థం' అని కొన్నిచోట్ల సూచిస్తాయి. ఈ వ్యాసం Culcutta Linguisitic Journalలో అచ్చయింది. ఇది నేను కలకత్తాలో ప్రచురించిన మొదటి వ్యాసం.

సునీతీ కుమార్ ప్రపంచ పౌరుడు, అనేక దేశాలు సందర్శించి ఆయా

ప్రాంతాల ఉత్తమ గ్రంథాలను కళాఖండాలనూ సేకరించి తన నాలుగంతస్తుల మేడలో అలంకరించేవారు. కలకత్తాలో విద్యార్థిగా చేరక ముందు రాష్ బిహారీ అవెన్యూ, బాలీగంజ్‌లో వారింటికి వెళ్ళినప్పుడు నేను చదవవలసిన పుస్తకాలను చూపిస్తుండగా వీటిని చూశాను. నేను పూజా (దసరా) సెలవలకు ఇంటికి వెళుతూ వారిని కలిసినప్పుడు శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం పుస్తకం తెమ్మనగా నేను దానితో పాటు కొన్ని బత్తాయి పళ్ళు తీసుకొని వెళ్ళాను. వారు దీనినేమంటారు? అని అడిగారు; బత్తాయి అన్నాను. Yes, from Batavia అని వ్యుత్పత్తి కలిపారు.

ఏదైనా ఒక పదం ప్రస్తావనకు వచ్చినప్పుడు ఆ పదం ఆయా కాలాల్లో ఆయా దేశాల్లో ఏయే మార్పులు పొంది ఇప్పటి స్వరూపం కలిగిందో బ్లాక్‌బోర్డ్ అంతా నిండిపోయేలా తన అందమైన దస్తూరీతో రాసేవారు. క్షితీశ్‌చంద్ర ఒకప్పుడు నాతో అన్నమాట ‘నాకు గ్రీక్, లాటిన్, ఇతర భాషల్లో సందేహం వచ్చినపుడు ఫోన్‌లో వారిని అడిగితే వెంటనే ఆ రూపం చెప్పేవారు. నిద్రలో లేపి ఏదైనా సందేహం అడుగు, వెంటనే సరైన సమాధానం వస్తుంది.’

సునీతీ కుమార్ ధ్వనిశాస్త్రం, హిందీ భాషాతత్త్వం, అనార్య భాషాతత్త్వం పాఠం చెప్పేవారు. ద్రావిడ భాషలకు Strecture Grammaticale de la Langue Dravidianne అనే ఫ్రెంచి పుస్తకం తరగతిలో ఆశువుగా అనువాదం చేసి చెప్పారు. దీని ఇంగ్లీషు అనువాదం చాలాకాలం తరువాత కాని రాలేదు.

ద్రావిడభాషలకు పాఠ్యం G.U.Pope, రచించిన Hand book of Tamil Language నేను స్వయంగా చదువుకున్నాను. టిబెటన్ భాషకు పాఠ్యం Pearls of Wisdom చెప్పడానికి ఒక బౌద్ధ సన్యాసిని కుదిర్చారు. ఏం కారణమో పాఠం చెప్పడానికి ఆయన సరిగా వచ్చేవారు కాదు. అందువలన ఆభాష సరిగా అవగాహన కాలేదు.

సునీతీ కుమార్ గారితో ఈ విషయం చెబితే ఆయనకు యూనివర్సిటీ ఆఫీసులో శ్రమకలిగించిన వాడనవుతానని ఆయనకు చెప్పలేదు. చివరకు నష్టపోయింది నేనే. విశిష్టమైన టిబెటన్ వాతావరణంలోకి

ప్రవేశించలేక పోయాను.

ఎమ్.ఎ పరీక్ష పూర్తి కాగానే సునీతీకుమార్ గారిని ఇంట్లో కలుసుకున్నాను. అప్పుడు వారు సుశీల్ కుమార్ డే (Sushil kumar Dey) గారితో మాట్లాడుతున్నారు. నన్ను వారికి పరిచయం చేస్తూ He is one of my good students అన్నారు. దానికి ఆయన A German professor considers himself fortunate if he gets a good student once in ten years అన్నారు. సుశీల్‌కుమార్ గారు ప్రఖ్యాత సంస్కృతాంగ్లపండితులు, అనేక పాశ్చాత్య విశ్వవిద్యాలయాలలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉన్నవారు.

వారిని సాగనంపిన తరువాత కుర్చీ నా దగ్గరకు లాగుకొని కాగితం కలం ఇచ్చి రాసుకోమన్నారు. ఏమిటో మొదట నాకు అర్థంకాలేదు. అది తెలుగు చారిత్రకవ్యాకరణానికి సంక్షిప్తిక. దానిని డి.లిట్. డిగ్రీ కొరకు సమర్పించమన్నారు. అప్పట్లో ప్రొఫెసర్ సిఫారుసు చేస్తే మొదటి డాక్టరేట్ డి.ఫిల్ చేయకుండానే నేరుగా డి.లిట్ చేయవచ్చు. ఈవిధంగా నేరుగా డి.లిట్ చేసిన వారు ఈ శాఖలో, విశ్వవిద్యాలయంలోను మరెవ్వరూ లేరు.

అయితే పరిశోధన మొదలు పెట్టకముందు మానవశాస్త్ర సంస్థ డైరెక్టరు డా.బి.సి.గుహ తమ సంస్థలో ట్రైనింగుకి ఒక అభ్యర్థిని పంపమనగా సునీతీకుమార్ నా పేరు చెప్పారు. మానవశాస్త్రంలో నాలుగు విభాగాలు ఉంటాయి.

1. శారీరిక నిర్మాణం (Physical Anthropology)

2. సంస్కృతి (Social Anthropology)

3. మనస్తత్వ శాస్త్రం (Psychology)

4. భాష (Language)

ఈ నాలుగింటిలో పరిచయం కలిగించడానికి అక్కడి ఆఫీసర్ల ఉపన్యాసాలు, లైబ్రరీలో అతి ప్రాచీనభాషలను గురించిన పుస్తకాలు (Primitive Linguistics) చదవటం– ఇలా ఆరు నెలలు గడిచాయి. తరువాత

క్షేత్రకార్యానికి (Field work) ఇద్దరు మనస్తత్త్వ శాస్త్రజ్ఞులు: (ఒకరు ఉమా బోస్, (డైరెక్టరు గారి భార్య), ఆమెకు సహాయంగా ఎమ్.ఎస్.కౌల్; భాషావేత్తగా నన్ను ఒక బృందంగా ఏర్పరిచి జౌన్‌పూర్ జిల్లాకు పంపించారు. కేంద్ర ప్రభుత్వం పనిమీద రావడం కనుక జిల్లా కలక్టరు, మరి ఇద్దరు ఉన్నతోద్యోగులకు మా సంచార వివరం అందేది. మాకు కావలసిన సదుపాయాలు వారు సమకూర్చేవారు. కేరాకట్ రైల్వేస్టేషన్‌కు దగ్గరగా ఉన్న సేనాపూర్ గ్రామంలో మా స్థావరం. అక్కడినుండి ఉమా బోస్, కౌల్ మారుమూల గ్రామాలలో సంచరించి అక్కడి ప్రజల సాంఘిక పరిస్థితులను లోతుగా తెలుసుకొనేవారు. నేను ప్రజలతో కలసిమెలసి ఉంటూ, స్థానిక పాఠశాల ఉపాధ్యాయుల సహాయం తీసుకుంటూ వారి పలుకుబడిని గమనిస్తూ త్వరలో ఆ భాష– పశ్చిమ భోజ్‌పురికి వ్యాకరణం కూడా రాయగలిగాను. హిందీ భాష తెలిసి ఉండడంవల్ల ఈ పని సుసాధ్యమైంది. ముఖ్‌రాంసింగ్ అనే ప్రాథమికపాఠశాల విశ్రాంత ప్రధానోపాధ్యాయుని సహాయంతో పన్నెండు జానపద కథలను సేకరించడం జరిగింది.

మాతో ఒక బిళ్ళ బంట్రోతు, వంటవాడు, ఇద్దరు సహాయకులు ఉండేవారు. సేనాపూర్‌లో వంట, భోజనం; అక్కడినుండి ఇతర చోట్లకు వెళ్ళడం పరిపాటి.

ఒకమాటు సమీప గ్రామంలోని ఒక సంపన్న గృహస్థు మమ్మల్ని ఆహ్వానించి, మార్గం సరిగా లేనందున మమ్మల్ని తీసుకొని వెళ్లడానికి ఏనుగును పంపించాడు. ఏనుగు తీసిఇస్తున్న బటానీ మొక్కలలో గింజలు తింటూ పొలాల గుండా నాలుగైదు కిలోమీటర్లు దానిమీద ప్రయాణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. రోడ్లు సరిగా ఉన్నప్పుడు తేలికయైన గుర్రబ్బండి మీద ఒకరిద్దరు ప్రయాణానికి వాడతారు. దీనిని 'ఎక్కా' అంటారు.

గ్రామస్తుల ఆదరం చెప్పనలవి కాదు. పొద్దుట అల్పాహారానికి వేయించిన పప్పులు, కంచు బాల్చీలతో చెరుకురసం ఇచ్చేవారు. అక్కడ చెఱుకు

తోటలు ఎక్కువ. ఇంటికి వచ్చిన పైవాళ్ళు కూచోడానికి ఇంటిముందు చిన్నచావడి ఉంటుంది. దీనిని 'బైఠక్' అంటారు. ఘోషా పద్ధతి.

ఈ పని అయిన తరువాత సునీతీ కుమార్ గారిని కలిసి ఈ భోజ్‌పురి సామగ్రిని లక్నోలో ఉదయ్‌నారాయణ్ తివారి గారికి చూపించాలనుకుంటున్నానని చెప్పగా వారు పరిచయ పత్రం రాసి ఇచ్చారు. This is to introduce to you one of your satirthas in the university of Calcutta (సతీర్థ– ఒక గురువు దగ్గర చదువుకున్న శిష్యుడు). సునీతీ కుమార్ మాటల్లో, రాతల్లో ఆర్షసంస్కృతి ప్రతిఫలిస్తూ ఉంటుంది.

లక్నోలో తివారీగారి ఇంటికి వెళ్ళి, వచ్చిన పని చెప్పాను. వారు అప్పుడు సాహిత్య అకాడమీ సమావేశానికి వెడుతూ నన్ను తనతో తీసుకొని వెళ్ళారు. ఆ సభలో ముఖ్య అతిథి ప్రసంగం కాగానే నేను సేకరించిన కథలలో ఒకటి చదవమన్నారు. కథ మొదలు పెట్టగానే సభలో హర్షధ్వానాలు. కారణం కథ హాస్యాత్మకంగా ఉండడం, అసలు సిసలైన భోజ్‌పురీ భాషోచ్చారణలో ఉండడం. కథ ధ్వన్యాత్మక లిపిలో రాసుకున్నది కనుక అది సాధ్యమైంది.

1954లో కేంద్రప్రభుత్వ ఉపకార వేతనం లభించింది. సునీతీకుమార్ గారి పర్యవేక్షణలో (ఉత్తర ప్రత్యుత్తరాలతో మధ్యలో వారిని కలుస్తూ), మద్రాసు విశ్వవిద్యాలయంలో తమిళ భాషాధ్యక్షులు సేతుపిళ్లెగారు స్థానిక పర్యవేక్షకులుగా– థీసీస్ పూర్తి చేసాను. దీని పరీక్షకులు ముగ్గురూ విదేశీయులు. ఎమ్.బి.ఎమెనో (M.B.Emenau) (కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం అమెరికా), టి.బర్రో (T.Burrow) (ఆక్స్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయంలో సంస్కృతభాషాచార్యులు, ఆక్స్‌ఫోర్డ్), ఆల్‌ఫ్రెడ్ మాస్టర్ (Alfred Master) (స్కూల్ ఆఫ్ ఓరియెంటల్ అండ్ ఆఫ్రికన్ స్టడీస్ సంస్థలో ప్రొఫెసర్, లండన్). వీరు ఈ కృషి విశిష్టమైనదని మెచ్చుకున్నారు.

అన్నామలై విశ్వవిద్యాలయం దక్షిణాదిన మొట్టమొదట భాషాశాస్త్రవిభాగం ప్రారంభించిన ఉత్సవసందర్భంలో ఆహ్వానితులై వచ్చిన

సునీతీకుమార్ ఛటర్జీగారు సేతుపిళ్లైగారితో కూడిన కమిటీ నన్ను ఆ శాఖలో లెక్చరర్‌గా నియమించారు. ఆ తరువాత తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో రీడర్ గాను, అనంతపురం శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవి.

ఈ విధంగా నాకు గురువుల అనుగ్రహం కలిగింది.

* * * * *

**తెలుగు వానిగా పుట్టడం, తెలుగు మాట్లాడడం**
**ఉత్కృష్టమైన తపఃఫలము.**
**ఆర్యోక్తి**